ముకుళీకృత మంగీకృత మిత్యర్థః. (ఉదారా) ఉదారా-ఉదారే-ఉదారాః ఉదారా శబ్దః ఆకారాంత స్త్రీలింగః ప్రథమైక వచనాంతః. త్వత్+ముఖా త్వన్ముఖా, అనునాసిక సంధి. యత్+మయః యన్మయః అనునాసిక సంధి. నిర్దిష్టైః+చనిత్యైః శ్చుత్వ సంధి. యన్మయః+ఏవ యన్మయ ఏవ, విసర్గలోప సంధి.

ఛందోలంకారములు. వసంతతిలకావృత్తము. త-భ-జ-జ-గగ యుండవలయును. సంభావనాలంకారము. నీళాదేవితో నుండియున్న దేవరవారు. ఇరువురును దాసుని పరిపూర్ణముగా అంగీకరింపవలయునని వాంఛించుట.

భావము. క్రింది రెండు శ్లోకములందు శ్రీ భూదేవుల సహయోగమును పెరుమాళ్ళతో మూడవదిగా అనుసంధించినారు. ఇందు నీళాదేవిని అనుసంధించి, ఆమె యంగీకారము ను ప్రార్థించుచున్నారు. గంభీర మనోహరములైన చిత్తవృత్తుల ~~సూచ~~ సూచకము లైన శృంగార చేష్టితముల చేతను భ్రూవిలాసములు-చిఱునగవు-క్రీగంటి చూపులు, అనువానితోను నీళాదేవి దేవరవారి తాదాత్మ్యమును లభించుటయు, దేవరవారు, ఆ నీళా దేవి యొక్క తాదాత్మ్యమును లభించుటయు గలదో? అట్టి నీళాదేవి, దాసుని అంగీ కరించి కైంకర్యములను స్వీకరింపవలయును. అని యనుగ్రహించుచున్నారు. 'యన్మయః' అను భావమునకు తగిన విధముగా, "మనస్తద్గత సృష్టిః నిత్యం హృది సమర్పితః." అను శ్రీరామాయణ శ్లోకమును అనుసంధింపదగును. పరస్పరము గల యనురాగమును చెప్పినారు.

భావై రనుక్షణ మపూర్వ రసానువిద్ధైః
అత్యద్భుతై రభినవై రభిసంధ్య దేవీః।
భృత్యాన్ యథోచిత పరిచ్ఛదినో యథార్హం
సంభావయంత మభితో భగవన్! భవేయమ్॥ ౨౩.

పదవిభాగము. భావైః, అనుక్షణమ్, అపూర్వ రసానువిద్ధైః, అత్యద్భుతైః, అభినవైః, అభిసంధ్య, దేవీః, భృత్యాన్, యథోచిత పరిచ్ఛదినః, యథార్హం, సంభావయంతం, అభితః, భగవన్, భవేయమ్.

అర్థము. భగవన్=భగవానుడా! అనుక్షణం=ప్రతిక్షణము, అపూర్వరసానువిద్ధైః, అపూర్వ=అపూర్వముగా ఉన్న, రస=శృంగార రస విశేషములతో, అనువిద్ధైః=కూడినవియు, అత్యద్భుతైః=మిక్కిలి యాశ్చర్యమును కలిగించునవియు, అభినవైః=క్రొత్తవిగానున్న, భావైః=చిత్తవృత్తులతో, దేవీః=పత్నులను, అభిసంధ్య=సంతోషింపజేసి, యథోచిత పరిచ్ఛదినః, యథోచితః=తమకు తగిన, పరిచ్ఛదినః=కైంకర్యమునకు కావలసిన యుపకరణము లను గలిగిన (నిత్యసూరులైన) భృత్యాన్=కింకరులను, యథార్హం=తగిన విధము గా, సంభావయంతం=సత్కరించుచున్న. భగవంతం అభితః=పరమపదనాథుడ వైన నిన్ను (దేవరవారిని) చుట్టియుండి, భవేయమ్=వర్తించువాడనగుదును.

ఆకాంక్ష. భవేయం=వర్తించువాడనగుదును. కః=ఎవడు? అహం=దాసుడనైన నేను. కం పరితః=భగవంతుడవైన నిన్ను చుట్టి, భగవంతం కథం భూతం=పర మపదనాథుడెట్టివాడు? సంభావయంతం=సత్కరించుచున్నవాడు, కాన్=ఎవరిని? భృత్యాన్=కింకరులైన నిత్యసూరులను. భృత్యాన్ కథంభూతాన్.
కింకరులెట్టివారు? ...

౦హాంసి. అంహః శబ్దః సకారాంత నపుంసకలింగః ప్రథమైక వచనాంతః." కలుషం వృజినైనో వంహోదురిత దుష్కృతమ్ ఇత్యమరః. హతకః+అస్మి, హతకోఽస్మి. ఉత్వము - ఉత్వము. గుణసంధి పూర్వరూప సంధి. ఖలః+అస్మి, ఖలోఽస్మి. ఉత్వము ఉత్వము. గుణసంధి. పూర్వరూపసంధి. ధిక్+మాం, ధిఙ్మాం. అనునాసికసంధి. మాదృక్+అంహాః, మాదృగంహాః. జశ్త్వసంధి.

శబ్దాలంకారములు. పదంత లకార వృత్త్యను, త-శ-ఖ-జ-గ లుండుట వలన. వ్యతిరేకాలంకారము. "ప్రతిరేకో విశేషశ్చేత్ ఉపమానోపమేయయోః" ఉపమేయమైన సర్వేశ్వరునికి అఖిల హేయ ప్రత్యనీకత్వము, కల్యాణగుణాస్పదత్వము విశేషముగా చెప్పబడి, తనకు కేవలము పాపరూపత్వమును అనర్హత్వమును చెప్పబడినది. కనుక వ్యతిరేకాలంకారము.

భావము. పరమపదనాథుని పేరోలగమందు నిత్యకైంకర్యమును చేయగలుగ వలయునని క్రింద అడిగినారు. ఆ పరమపురుషుని అసంఖ్యేయ కల్యాణగుణములను తమ అంతులేని అయోగ్యతలను తలచుకొని "ఉత్తమోత్తముడైన ఆ స్వామి యెక్కడ! అధముడైన నేనెక్కడ! దేవతలకర్హమైన పురోడాశమును కుక్క ఆశించిన విధముగా కదా మహాత్ములకు తగిన భగవత్కైంకర్యమును నేను కోరుట! మతి చెడి యిట్లను ఆశపడవచ్చునా! సంసారమందలి నేను ముదుగని నిత్యసూరులు ఆశపడదగిన నిత్యకైంకర్యమును నిత్యసంసారినైన నేను ఆశపడుట తప్పిదమే కదా! హా! హా! ఎంత సాహసమైన పనిని చేయ సాహసించితిని!" అని తమను తాము అసహ్యపడుచున్నారు.

అయ్యో! పాపిని, దరిద్రుడను నన్ను మఱచిపోయి కొన్ని పలికినాను. పాపాత్ముడను, ఏమి మాటలాడితిని! అఖిల హేయప్రత్యనీక కల్యాణైకతానువైన దేవరవారిని ఈ పాప రూపము స్మరించుటకును తగదు కదా! అనుచున్నారు. 'మాదృగంహాః' నావంటి పాపి, అనవలసినచోట 'నావంటి పాపము' అని తమను పాపముగానే చెప్పుకొనుట, పాపప్రాచుర్యమును బట్టి పాపమే రూపుదాల్చి కదా నేనున్నాను. అనబడినది.

అంహః ప్రసహ్య వినిగృహ్య విశోధ్య బుద్ధిం
వ్యాధూయ విశ్వమశివం జనుషానుబద్ధమ్ ।
ఆధాయ సద్గుణగణానపి నాఽహమర్హః
త్వత్పాదయోర్యదహమత్ర చిరాన్నిమగ్నః ॥ ౮౭.

పదవిభాగము. అంహః, ప్రసహ్య, వినిగృహ్య, విశోధ్య, బుద్ధిం, వ్యాధూయ, విశ్వం, అశివం, జనుషా, అనుబద్ధం, ఆధాయ, సద్గుణగణాన్, అపి, న, అహం, అర్హః. త్వత్పాదయోః, యత్, అహం, అత్ర, చిరాత్, నిమగ్నః.

అర్థము. స్వామీ! అంహః = నా పాపమును, ప్రసహ్య = బలాత్కారముగా, వినిగృహ్య = పోగొట్టుకొని, బుద్ధిం = బుద్ధిని, విశోధ్య = శుద్ధముగా చేసికొనియు, జనుషా =

సత్కర్మ నైవ కిల కించన సంచినోమి
విద్యాప్యవద్యరహితా న చ విద్యతే మే ।
కించ త్వదంచిత పదాంబుజ భక్తిహీనః
పాత్రం భవామి భగవన్! భవతో దయాయాః ॥ ౮౪॥

పదవిభాగము- సత్కర్మ, న, ఏవ, కిల, కించన, సంచినోమి, విద్యా, అపి, అవద్య రహితా, న, చ, విద్యతే, మే, కిం, చ, త్వదంచిత పదాంబుజ భక్తిహీనః, పాత్రం భవామి, భగవన్, భవతః, దయాయాః.

అర్థము. హే భగవన్ = ఓ భగవానుడా! సత్కర్మ = మంచిపనిని, కించన = కొంచె మును, నైవ సంచినోమి = చేయకున్నాను. అవద్య రహితా = పాపములేని. విద్యా అపి చ = విద్యయును. మే = నాకు (దాసునికి) న విద్యతే = లేదు. కించ = ఇంకనేమనగా, త్వదంచిత పదాంబుజ భక్తిహీనః = త్వత్ = నీయొక్క (దేవరవారి) అంచిత = శ్రేష్ఠమైన. పదాంబుజ = పాదపద్మములందు, భక్తిహీనః = భక్తియు లేనివాడను. భవతః = నీయొక్క (దేవరవారి) దయాయాః = దయకు మాత్రము, పాత్రం = పాత్రమునుగా భవామి = అగుచున్నాను.

అన్వయక్రమం. భవామి = అగుచున్నాను. కః = ఎవడు, అహం = నేను (దాసుడను) కించనికి? పాత్రం = పాత్రమునుగా, కస్యాః = దేనికి? దయాయాః = దయకు. కస్యాః ఎవనియొక్క, భవతః = నీయొక్క (దేవరవారి) అహం కథం భూతః = నేను ఎట్టివాడను త్వదంచిత పదాంబుజ భక్తిహీనః = నీయొక్క (దేవరవారి) శ్రేష్ఠమైన పాదపద్మముల యందు భక్తిలేనివాడను. కించ = ఇంకను, న విద్యతే = లేదు. కస్య ఎవ్వనికి, మే = నాకు, (దాసునికి) కాం ఏది, విద్యా అపి చ విద్యయును, విద్యా కథంభూతా = ఎటువంటి ది? అవద్య రహితా = పాపములేనిది, నైవ సంచినోమి = చేయకున్నాను, కిం = దేనిని సత్కర్మ = మంచిపనిని, కథంభూతం = ఎట్టిపనిని కించన = కొంచెము కూడ. హే భగవన్, సంబోధనము.

శబ్దరూప సమాసములు. (సత్కర్మ) సత్ చ తత్ కర్మచ సత్కర్మ. విశేషణ పూర్వపద కర్మధారయము. సత్కర్మ, సత్కర్మణీ - సత్కర్మాణి. సత్కర్మ శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైక వచనాంతః. (న-ఏవ-కిల-కించన) అవ్యయములు. (సంచినోమి) సంచినోమి-సంచినువః, సంచిన్వః - సంచినుమః, సంచినోషి, సం, ఇత్యుపసర్గ పూర్వక చిఞ్-చయనే ఇతి ధాతోః పరస్మైపది లట్ ఉత్తమ పురుషైక వచనమ్. (విద్యా) విద్యా-విద్యే-విద్యాః విద్యాశబ్దః ఆకారాంత స్త్రీలింగః ప్రథమైక వచనాంతః (అపి) అవ్యయము. (అవద్య రహితా) అవద్యరహితా, అవద్య రహితా-అవద్యరహితే-అవద్యరహితాః అవద్యరహితా శబ్దః ఆకారాంత స్త్రీలింగః ప్రథమైక వచనాంతః. తృతీయాతత్పురుషము. (న-చ) అవ్యయము (విద్యతే) విద్యతే-విద్యేతే-విద్యన్తే, విద్-లాభే ఇతి ధాతోః

షష్ఠీ బహువ్రీహి. పాపాన్యం-పాపాన్యే-పాపాన్యాని. పాపాన్యశబ్దః అకారాంత నపుంసక లింగః ద్వితీయైకవచనాంతః. (అల్పమ్) అల్పం-అల్పే-అల్పాని. అల్పశబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. (ఉరు) ఉరు-ఉరుణీ-ఉరూణి. ఉరుశబ్దః ఉకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. "విశంకటం పృథు బృహత్ విశాలం పృథులం మహత్. వడ్రోరు విపులమ్" ఇత్యమరః. (వా) అవ్యయము. (తత్) తత్-తే-తాని. తచ్ఛబ్దః దకారాంతః ~~పుంలింగః~~ నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. (అశేషమ్) నాస్తి శేషః అస్య ఇతి అశేషమ్. "విశ్వమశేషం కృత్స్నం సమస్త నిఖిలాఖిలాని నిశ్శేషమ్" ఇత్యమరః. అశేషం-అశేషే-అశేషాణి. అశేష శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయైకవచనాంతః. (ఏషః) ఏషః-ఏతౌ-ఏతే. ఏతచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (జానన్) జానన్-జానన్తౌ-జానన్తః. జానన్ శబ్దః తకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (న-హి) అవ్యయములు. (శతసహస్ర పరార్ధకృత్వః) అవ్యయము. అపరిమితకృత్వః. అనియర్థము. సంఖ్యలకు అవధిగా గ్రహింపబడునది. "పారే పరార్ధం గణనా యది స్యాత్" అనునది నైషధకావ్యమందు శ్రీహర్షుని వాక్కు. తైత్తిరీయ సంహితయందు ఏడవ కాండయందు. రెండవ ప్రశ్నమున. "శతాయ స్వాహా సహస్రాయ స్వాహా" అని యారంభించి, శతమ్-సహస్రమ్-అయుతమ్-నియుతమ్-ప్రయుతమ్-అర్బుదమ్-న్యర్బుదమ్-సముద్రమ్-మధ్యమ్-అన్తమ్-పరార్ధమ్. అని ఆగినది. (యః) యః-యౌ-యే. యచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (అకార్షమ్) అకార్షం-అకార్ష్వ-అకార్ష్మ. డుకృఞ్-కరణే. ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లుఙ్. ఉత్తమపురుషైకవచనమ్. (ఏనమ్) ఏతం, ఏనం-ఏతౌ, ఏనౌ-ఏతాన్, ఏనాన్. ఏతచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (అగతిమ్) న విద్యతే గతిః యస్య సః అగతిః, తం. అగతిమ్. ప్రాదిబహువ్రీహి. అగతిం-అగతీ-అగతీన్. అగతిశబ్దః ఇకారాంతః పుంలింగః ద్వితీయైకవచనాంతః. (కృపయా) కృపయా-కృపాభ్యాం-కృపాభిః. కృపాశబ్దః ఆకారాంత స్త్రీలింగః తృతీయైకవచనాంతః. (క్షమస్వ) క్షమస్వ-క్షమేథాం-క్షమధ్వమ్. క్షమూష్-సహనే. ఇత్యస్మాద్ధాతోః. ఆత్మనేపది లోట్ మధ్యమపురుషైకవచనాంతః. "ప్రలపితేన నపుంసకే భావే క్తః" అనుటను బట్టి ప్రలాపేన. అని యర్థము. యత్+ఏవ, యదేవ. జశ్త్వసంధి. పాప+అన్యం పాపాన్యమ్. సవర్ణదీర్ఘసంధి. తత్+అశేషం, తదశేషమ్. జశ్త్వసంధి. పరార్ధకృత్వః+యః, పరార్ధకృత్వోయః, ఉత్వము. ఉత్వము గుణసంధి. యః+అకార్షం, యోఽకార్షమ్. ఉత్వము-ఉత్వము. గుణసంధి. పూర్వరూపసంధి.

ఛందోఽలంకారములు. వసంతతిలకావృత్తము త-భ-జ-జ-గగ లుండవలయును. హేత్వలంకారము. తెలిసియో తెలియకయో చేసినటువంటియును లెక్కింపరాని పాపమేల. కనుక భగవత్ ప్రాప్తికి మార్గము అవకాశము లేదు. వేఱొక ఉపాయమేదైన యున్నదా? అగతియై యున్నాను. కేవలము భగవంతుని కృపయే హేతువు. క్షమించుటయే కర్తవ్యము. అనుటవలన పాపము నశించుటకును కృపయే హేతువు.

శబ్దరూప సమాసములు. (దేవ) హే దేవ - హే దేవౌ - హే దేవాః. దేవ శబ్దః అకారాంతః పుంలిం
గః సంబోధన ప్రథమైక వచనాంతః. (హృదయ చరణ ప్రణయ ప్రవీణ రామానుజార్య
విషయీకృతమ్) తవ ఇమే హృదయా, షష్ఠీ తత్పురుషము, హృదయౌ చ తౌ చరణౌ చ,
హృదయ చరణౌ విశేషణ పూర్వపద కర్మధారయము, హృదయ చరణయోః ప్రణయః,
హృదయ చరణ ప్రణయః, సప్తమీ తత్పురుషము. హృదయ చరణ ప్రణయే ప్రవీణః,
హృదయ — ప్రవీణః. సప్తమీ తత్పురుషము హృదయ — ప్రవీణ శ్చాసౌ రామానుజార్యశ్చ.
హృదయ — రామానుజార్యః విశేషణ పూర్వపద కర్మధారయము హృదయ — రామానుజార్యేణ
విషయీకృతః, హృదయ — విషయీకృతః, తృతీయా తత్పురుషము. తం, హృదయ — విష
యీకృతమ్. విషయీకృతం - విషయీకృతౌ - విషయీకృతాన్, హృదయ చరణ ప్రణ
య ప్రవీణ రామానుజార్య విషయీకృత శబ్దః అకారాంతః పుంలింగః ద్వితీయైక వచనాం
తః. (అపి) అవ్యయము. (అహో) అవ్యయము. (మామ్) మాం, మా + ఆవాం, నౌ - అస్మాన్, నః. అస్మ
చ్ఛబ్దః దకారాంతః పుంలింగః ద్వితీయైక వచనాంతః. (భూయః) అవ్యయము. (ప్రధర్ష
యతి) ప్రధర్షయతి - ప్రధర్షయతః - ప్రధర్షయన్తి. ప్ర. ఇత్యుపసర్గ పూర్వక, ణిజ్ ధృష - ప్రాగ
ల్భ్యే, ఇత్యస్మాద్ధాతో ర్లట్ పరస్మైపది లట్ ప్రథమ పురుషైక వచనమ్. (వైషయి
కః) విషయేషు భవః వైషయికః, వైషయికః - వైషయికౌ - వైషయికాః. వైషయిక
శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (వ్యామోహః) వ్యామోహః - వ్యామో
హౌ - వ్యామోహాః. వ్యామోహ శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైక వచనాంతః. (మత్
కర్ణయోః) మమ కర్ణౌ, మత్కర్ణౌ, తయోః, మత్కర్ణయోః, షష్ఠీ తత్పురుషము. మత్కర్ణ
స్య - మత్కర్ణయోః - మత్కర్ణానామ్. మత్కర్ణ శబ్దః అకారాంతః పుంలిం
గః షష్ఠ్యేక వచనాంతః. (కతరత్) కతరత్ - కతరే - కతరాణి, కతర శబ్దః అకా
రాంత నపుంసకలింగః ప్రథమైక వచనాంతః. (అత్ర) తసిలంతావ్యయము. (సమాన
సారమ్) సమానః సారః యస్మిన్ తత్, సమాన సారమ్. సప్తమీ బహువ్రీహి, సమాన
సారం - సమాన సారే - సమాన సారాణి. సమాన సార శబ్దః అకారాంత నపుంసకలింగః
ప్రథమైక వచనాంతః. రామానుజ + ఆర్య. రామానుజార్య సవర్ణదీర్ఘ సంధి, అపి + అహో
అప్యహో. యణాదేశ సంధి. వైషయికః + వ్యామోహః + మత్కర్ణయోః. వైషయికో వ్యా
మోహో మత్కర్ణయోః, ఉత్వము - ఓత్వము. గుణ సంధి. కతరత్ + అత్ర, కత
రదత్ర. జశ్త్వ సంధి.

ఛందోఽలంకారములు. వసంత తిలక వృత్తము. త - భ - జ - జ - గగ లుండవలయును.
విభావనాలంకారము. "విభావనా వినాఽపిస్యాత్ కారణం కార్యజన్మచేత్".
శ్రీ మద్రామానుజుల అనుగ్రహమును పొందిన వస్తుగూడ వైషయిక వ్యామోహము
పరిభవించుట. విభావన. అనుగ్రహము పొందని వారిని వ్యామోహము పరిభవిం
చుట సహజము. ఇది అకారణము లే~~కు~~న్నను పుట్టినదగుట.

భావము. ఈ స్థితియందు ఆచార్య నామోచ్చారణము చేయుట శ్రేయస్కర
మని భావించి మొదటి విధముగా ఆ నామోచ్చారణమును చేయుచు
[illegible] వారి [illegible] పాదములందలి భక్తియే నిరూపకము

గల యుండెడు వారో (శ్రీమద్రామానుజులు) దాసుని నిర్హేతుకము
గా అనుగ్రహించియుండుట వలన దాసుని కొరకొదువయును లేదు,
అని యుంటిని. ఇట్లు దాసుడను పెద్ద అవలంబమును పొంది యుండినను
ఈ యజ్ఞానాంధకారావృతమైన భూమియందు, తన్మూలమున విషయవా
సనచేత శేషయుక్తమోహము దాసుని పరిభవించుచున్నది. "వు
దనకదన్నైర్న క్లిశ్యన్తే యతీశ్వర సంశ్రయాః" (యతిరాజసప్తతి) అని
యు, "కామాది దోషహర మాత్మ పదాశ్రితానాం" (యతిరాజవింశతి) అని
యు చెప్పునట్లు, ప్రసిద్ధి నందిన శ్రీమద్రామానుజుల పరిగ్రహమైన దాసు
నికి యీవిధముగా సంభవింపదగదు గదా? సంభవించుట వలన బల
వత్తరమైన కర్మము, నాకే అసాధారణము, అని తలచుకొనవలసియున్నది.
అనుచున్నారు. (అత్ర మత్కర్మణః సమాన సారం కతరత్) ఈ లోకమందు
నావలె ఘోర పాపములను చేసినవారున్నారా? అని భావము.

గర్భేషు నిర్భర నిపీడన ఖిన్నదేహః
క్షోదీయసోఽతి మహతోఽప్యఖిలస్య జంతోః।
జన్మాంతరాణ్యను విచింత్య పరస్వహస్రా
జ్ఞాత్వాహ మప్రతివిధి ర్విహతశ్చరామి ॥౨౧.

పదవిభాగము. గర్భేషు, నిర్భర నిపీడన ఖిన్నదేహః, క్షోదీయసః, అతిమహతః, అపి, అఖిలస్య, జంతోః, జన్మాంతరాణి, అనువిచింత్య, పరస్వహస్రాణి, అత్ర, అహం, అప్రతివిధిః, విహతః, చరామి.

అర్థము. క్షోదీయసః = మిక్కిలి క్షుద్రమైనదియు, అతిమహతః = మిక్కిలి పెద్దదిగాను యున్న, అఖిలస్య = సకలమైన, జంతోః అపి = జంతువు(ల) యొక్కయు, గర్భేషు = గర్భములందు, నిర్భర నిపీడన ఖిన్నదేహః, నిర్భర = భరించుటకు అలవికాని, నిపీడన = మిక్కిలి యొత్తిడి వలన, ఖిన్న = ఖేదింపబడిన, దేహః = శరీరము గల, అహం = నేను (దాసుడను) పరస్వహస్రాణి = పెక్కువేలు, జన్మాంతరాణి = ఇతర జన్మములను (గలుగబోవువానిని) అనువిచింత్య = చింతించి, అత్ర = ఈ పుట్టుకలందు అప్రతివిధిః = ఒకవిధమైన ప్రతిక్రియను గూడ యెఱుగనివాడనై, విహతః = మృతప్రాయుడనై, చరామి = సంచరించుచున్నాను.

ఆకాంక్ష. చరామి = సంచరించుచున్నాను. కః = ఎవడు? అహం = నేను (దాసుడను) కథంభూతః = ఎట్టివాడనై? విహతః = మృతప్రాయుడనై, అహం, అను ప్రథమాంతకర్తృపదము. చరామి, అను క్రియాపదమే యున్నది గనుక కర్మకర్తరి ప్రయోగము. అహం పునః కథంభూతః = నేనింకను ఎట్టివాడను? అప్రతివిధిః = ఒకవిధమైన ప్రతిక్రియను గూడ యెఱుగనివాడనై, కుత్ర = ఎచ్చట? అత్ర = ఈ పుట్టుకల విషయమందు, కిం కృత్వా = ఏమి చేసి, అనువిచింత్య = చింతించి. కాని = వేనిని? పరస్వహస్రాణి ~~జన్మాంతరాణి పెక్కువేలు జన్మము~~ జన్మాంతరాణి = పెక్కువేల ఇతర జన్మములను (గలుగబోవువానిని) అహం కథంభూతః = నేనెట్టివాడను? నిర్భర నిపీడన ఖిన్నదేహః = భరించుటకలవికాని మిక్కిలి యొత్తి
డిచే ఖేదింపబడిన శరీరము గలవాడను. కేషు = ఎందు, గర్భేషు = గర్భములందు

అపి - అదేనికి అఖిలస్య జంతోః అపి సకలమైన జంతువు(ల)యొక్క(యు), జంతోః దేహం ఛేత్తుం జంతువెట్టది! అతి మహతః - మిక్కిలి పెద్దదియు, క్షోదీయసః - మిక్కిలి క్షుద్రమైనదియునైనది.

శబ్దరూప సమాసములు. (గర్భేషు) గర్భే - గర్భయోః - గర్భేషు, గర్భశబ్దః అకారాంతః పుంలింగః సప్తమీబహువచనాంతః " గర్భో భ్రూణ ఇమౌ సమౌ ఇత్యమరః. (నిర్భర నిపీడన ఖిన్నదేహః) నిర్భరం చ తత్ నిపీడనం చ నిర్భర నిపీడనమ్. విశేషణపూర్వపద కర్మధారయము. నిర్భర నిపీడనేన ఖిన్నః నిర్భర నిపీడనఖిన్నః. తృతీయాతత్పురుషము. నిర్భరనిపీడనఖిన్నః దేహః యస్య సః, నిర్భర నిపీడన ఖిన్నదేహః. బహువ్రీహి. ఖిన్నదేహః - ఖిన్నదేహౌ - ఖిన్నదేహాః. నిర్భర నిపీడన ఖిన్నదేహశబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (క్షోదీయసః) క్షోదీయసః - క్షోదీయసోః - క్షోదీయసామ్. క్షోదీయస్ శబ్దః సకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. (అతిమహతః) అతిమహతః - అతిమహతోః - అతిమహతామ్. అతిమహచ్ఛబ్దః తకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. (అపి) అవ్యయము. (అఖిలస్య) అఖిలస్య - అఖిలయోః - అఖిలానామ్. అఖిల శబ్దః అకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. (జంతోః) జంతోః - జంత్వోః - జంతూనామ్. జంతు శబ్దః ఉకారాంతః పుంలింగః షష్ఠ్యేకవచనాంతః. (జన్మాంతరాణి) జన్మని జన్మని జన్మాంతరాణి. జన్మాంతరం - జన్మాంతరే - జన్మాంతరాణి. జన్మాంతరశబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయా బహువచనాంతః. (అనువిచింత్య) అవ్యయము. (పరస్సహస్రాణి) పరస్సహస్రం - పరస్సహస్రే - పరస్సహస్రాణి. పరస్సహస్ర శబ్దః అకారాంత నపుంసకలింగః ద్వితీయా బహువచనాంతః. (అత్ర) అవ్యయము. (అహమ్) అహం - ఆవాం - వయమ్. అస్మచ్ఛబ్దః దకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (అప్రతివిధిః) న విద్యతే ప్రతివిధిః యస్య సః, అప్రతివిధిః. నఞ్ బహువ్రీహి. అప్రతివిధిః - అప్రతివిధీ - అప్రతివిధయః. అప్రతివిధి శబ్దః ఇకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (నిహతః) నిహతః - నిహతౌ - నిహతాః. నిహత శబ్దః అకారాంతః పుంలింగః ప్రథమైకవచనాంతః. (చరామి) చరామి - చరావః - చరామః. చర - గతిభక్షణయోః ఇత్యస్మాద్ధాతోః పరస్మైపది లట్ ఉత్తమ పురుషైకవచనమ్, క్షోదీయసః + అతిమహతః + అపి - క్షోదీయసోఽతిమహతోఽపి, ఉత్వము - ఉత్వము, సుబిసంధి - పూర్వరూప సంధి. అపి + అఖిలస్య, అప్యఖిలస్య! యణాదేశ సంధి. జన్మ + అంతరాణి. జన్మాంతరాణి. సవర్ణదీర్ఘ సంధి. జన్మాంతరాణి + అనువిచింత్య, జన్మాంతరాణ్యనువిచింత్య, యణాదేశ సంధి. పరస్సహస్రాణి + అత్ర, పరస్సహస్రాణ్యత్ర, యణాదేశ సంధి. అత్ర + అహం. అత్రాహమ్. సవర్ణదీర్ఘ సంధి. నిహతః + చరామి. నిహతశ్చరామి. శ్చుత్వసంధి.

ఛందోఽలంకారములు: వసంతతిలకావృత్తము. త-భ-జ-జ-గగలుండవలయును. విషాదనాలంకారము. "ఇష్టమూర్త విరుద్ధార్థ సంప్రాప్తిస్తు విషాదనమ్" భగవత్ప్రాప్తికై ఆచార్యులను ఆశ్రయించి మోక్షమార్గమున నడుచుచున్న తనకు, వివిధ జంతువులలో అనేక జన్మములను ఎత్తి గర్భములందలి బాధలననుభవించవలెయు పాపములను తలుచుకొని ప్రతిక్రియ చేయు కాలని తను అశక్తతకు విషాదమొందుట వలన, విషాదనాలంకారము.

భావము: ఈ శ్లోకము నుండి మూడు శ్లోకములతో సాంసారిక దుఃఖములు, తనకు మిక్కిలి సహింపరానివై యుండుటను మిక్కిలి నిర్వేదముతో

